Regd No. M. 3289 విడిపత్రిక అణా Regd No. N. 45

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 10245౦ జులై ౧ వ తేది ౧౯౩౭ గురువారము అర్థసం॥ చందా ౩

సంపుటము ౧౨ | తూపుబజారు హైద్రాబాదు - దక్కన్. | సంచిక ౧౬

శా. శ. ౧౮౫౯ — శ్రీ ఈశ్వర సం॥ జ్యేష్ఠ బ॥ ౮ గురువారము — ౨౬ అమర్దాదు ౧౩౪౬ ఫ.

# కవిత్వము

ఆంధ్రహృదయ నెల్లూరు రామకృష్ణారావు,

దేవులపల్లి రామానుజరావు

కవిత్వము అను విషయమునుగురించి సుప్రసిద్ధులనేకవిధముల నిర్వచించియున్నారు. తాను వర్ణింపదలచినవిషయమును పాఠకుల మనోదర్పణమునందు ప్రతిఫలింపజేయు సామర్థ్యము గలవాడే కవి! తద్విరచితమే కవిత్వము. దానికి గలసామర్థ్యమద్వితీయము! అయ్యది కొండొక యెడ పాఠకుని అసామాన్యరూపరేఖా లావణ్యలగు చక్కని బొమ్మల యౌవనామృతమును ద్రావించి పరవశునిగా చేయును. మఱొక్కయెడ నానందదాయకమగుప్రకృతి రామణీయకతను గాంచి సర్వజ్ఞుడగు సర్వేశ్వరు ఘనతను ప్రశంసింపజేయును. వేరొక్కయెడ పవిత్రములును, ఆదర్శప్రాయములునగు వీరవరేణ్యుల గాథలనువర్ణించి మనహృదయముల నుప్పొంగజేయును.

చ॥ "తలపైవాలునట్టుల వితంబిని
తారకలూగుచున్నవా
నలిమొగమేల పెట్టెదు, ప్ర
సన్నుడుగన్నుల ప్రేమ దించు, మ
గ్గలమగు విస్మయవ్యథలు
కొల్చుచునున్నవి! నమ్మవేసి పూ
వులుగల చెట్ల క్రింద మధు
పుంజవిజామము బాసి
జేసెదన్."

అనునది ప్రేమజీవనమునకు, నిదర్శనము ఇంక

శా॥ తావుల్ క్రేవల జల్లు చెంగలువకే
దారంబు తీరంబునన్,
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కొం
తారంబునం దెందువా
గ్రావాకల్పితకాయ మానజటిల
ద్రాక్షాగుళుచ్ఛంబులన్
పూవుందీవలనొప్పనొక్క భవనంబున్
గారుడోత్కీర్ణమున్.

అను పద్యమునందలి ప్రకృతిరామణీయకత యెగులమనోహరము?

జిజాబాయి, రణరంగమునకేగనున్న శివాజి నుద్దేశించి.

సీ॥ "వైరిసేతుమబొట్టువదనాబ్జ మునగాలి
మునుమారతిరిగి వచ్చెదవుగాక,
తనిపించెదవుగాక నినుపక్షులకీవు
ముదుర కందనగాయ భోజనంబు,
త్రావించెదవుగాక దండికత్తులకు
పరుల క్రొవ్వేడి నెత్తురు లతోసె,
గిలిపించెదవుగాక గెలుపు జండాపూలు
కంచు కోటల మస్తకములమీద."

అనిపలికినపలుకుల వీరరసముట్టిపడుచున్నది. చదివినను,వినినను, మనస్సునకానందముగలుగజేయు విలక్షణమైన రచనకవిత్వముగాక మరేమగును?

ఇదిరసికజనాస్వాద్యమై యలరారుచుండు.

ఉ॥ నల్లనివాడు, పద్మనయ
నంబులవాడు కృపారసంబుపై
జల్లెడువాడు. మౌళిపరి
స్ఫురితపింఛమువాడు, నవ్వురా
జిల్లెడు మోమువాడొకడు
చెల్వలమాన ధనంబుదెచ్చె, నో
మల్లియలార మీపొదల
మాటునలేడు గదమ్మ, చెప్పరే?"

అనుపద్యముపఠించునపుడు పాఠకుని హృదయమునందుబొడముచానంద మనిర్వచనీయముకదా! ఇట్టికవిత్వము వ్రాయుటకు పాండిత్యము ముఖ్యకారణముకాదు. "నిరుపహతి స్థలంబు" మొదలగునవి యంత గానవసరములుగావు. మనోహరమై, ప్రశాంతమైయులరారు ప్రకృతిసందర్శనమున నొకవ్యక్తి మనంబునగలుగు విలక్షణములైనభావములే, కవిత్వముగా పరిణమించవచ్చును.

గీ॥ "గూడులకువచ్చు పక్షుల కూజితములు,
పంజరించుజాయ గారడీ చక్కదనము
వినలవినవచ్చు కీటకావేశగీతి
కావునానినిపైతము కవినొనర్చు"

అను కవికుమారుని - కృముల్లెంతయు నాదరణీయములు. అనేకవిధసాంస్కృతిక సమాసబంధురము గాకపోయినను, ఉత్ప్రేక్ష కావ్యలింగాద్యలంకారశోభితంబు గాకపోయినను, మనోహరములగుభావములకలిగి యొకవిధమగు స్వతంత్రమైన పోకడగలరచనను కవిత్వముగాదని త్రోసివేయుట హృదయములక్షణముకాదు.

"ఎవరజల్మములోన యొకరమా వంటి
నిగ్గొచ్చినవ్వింది సిలకనాయెంకి,
ముందుమనకేజల్మ ముందో తెలియంటి,
తెల్లతెలబోయింది పిల్లనాయెంకి.
యెన్నాళ్ళమనకో లె యీసుకములంటి

కంటనీరెట్టింది జంటనాయెంకి,"

మాటుడిద్దానియందుగల భావమెంతయున్నతమో! అవెంకి, నాయుడు బావల పవిత్రప్రణయప్రకటనమొనర్చు నీసాటయే సహృదయుని హృదయము హర్షాంబుధి నోలలాడింపదు?—

కవిత్వము మానవహృదయము నాకర్షించుటయందుసమానమైనది. దానికిగలహృదయాకర్షణశక్తికి వ్యాకరణసహజపాండిత్యనిపద్యమే నిదర్శనము!

ఉ॥ కాటుకకంటి నీరుచను
కట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని
గాదిలి కోడల యోమదంబయో
హాటకగర్భురాణి నిను
నాకటికై గొనిపోయి, యల్లక

## గోలకొండ పత్రిక

## ౧౧ వ సంవత్సరాది సంచిక

చదవితీరవలసినది అమూల్యవిషయములు

౧ సురవరము ప్రతాపరెడ్డిగారి "భాషాదార్ఢ్యము" ౨ యెల్లాప్రగడ సీతాకుమారిగారి "నిజాంరాష్ట్రములో స్త్రీజనోద్యమము, ౩ మాడపాటి హనుమంతరావుపంతులుగారి "పాఠ్యప్రణాళిక—నిజాంరాష్ట్ర పరిపాలనము, ౪ ఉమ్మెత్తల కేశవరావుగారి "జేరుబావులి భూమిపన్ను, ౫ మందుముల రామచంద్రరావుగారి "మన న్యాయస్థానములో దేశభాషలకున్నస్థానము, ౬ ఒక హితైషిగారి "మనప్రభుత్వమువారి మతశాఖ", ౭ కొండా వెంకటరంగారెడ్డిగారి "మనభూములు—అందులోని వృక్షములు" ౮ పింగిలి వెంకటరామారెడ్డిగారి "విజయనగర సామ్రాజ్యము" మున్నగు అనేక ముఖ్యవిషయములుగల వ్యాసములు పెక్కులున్నవి, నిజాంరాష్ట్ర సమస్యలనుగూర్చి తెలిసికొనగోరు ప్రతియాంధ్రుడును చదవితీరవలసినవి.

గోలకొండపత్రిక చందాదారులు రెండణాల టప్పాబిళ్లలు పంపినచో ఉచితముగా పంపబడును- ఇతరులకు ౦-౮-౦

మేనేజరు గోలకొండపత్రిక
తూపుబజారు, హైద్రాబాదు-దక్కన్.

నాటకిటకీచకుల కమ్మ
త్రిశుద్ధిగ నమ్మ భారతీ!

ఈపద్యముజదివినంతనే మనహృదయములుప్పొంగి నీనావయైయున్న వాణీవచనంబునుజూచి పోతనామాత్యుని హృదయుంబునం దుదయించిన పరితాపము. యాపె దుఃఖశాంతికై, యాతడు నరాంకితమిచ్చగింపక నిష్పృశ్చరంబున దొప్పదోగుచుండినను, హాలికవృత్తి చేతనే "నిజదారసుతోదర" పోషణం బొనరించుకొనినయమ్మహానుభావుని త్యాగజీవనము జ్ఞప్తికి వచ్చితీరును.

ఒకమారుచదివిన తనివిదీరక పలుమారుపఠింపనుత్సాహము గొల్పురచనయే నిజమగుకవిత్వము. ఆదివిధగ్గిహ్వాదయులసొమ్ము. కాళిదాసకృత శాకుంతలము, భవభూతి విరచిత యుత్తరరామచరిత, షేక్స్పియర్ రచించిన "హ్యామ్లెటు" మొదలగునవి యీతరగతికి చెందినవియు, మనయాంధ్రసాహిత్యమునందుకూడ నిట్టివిలేకపోలేదు. పోతనకవిరచిత నిదర్శనములు తిక్కన పోతనామాత్యుని పద్యరత్నములు అష్టమ రగీతములు, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, ప్రహ్లాద చరిత్ర మొదలగునవియు యితరగ్రంథములయందలి యేకవిపద్యములైన మలకైవదీనిపోవు. పోతనకవిత్వముతో నుపమింపదగిన శ్రీకృష్ణుని మునస్సనామే.

మ॥ ఒకపూవందలి తేనెద్రావి మధుపా
యుత్సాహమైసవు నే
రొకటంబాసెడి భంగిమమ్మధర పీ
యూషంబునం దేల్చి మా
యకులోజ్జ్వల నవంబుగొని య
న్యాసక్తపయ్యెన్ విభుం
డకటా యాతనికెల్ల దక్కసిరి మి
థ్యాకీర్తి నవ్వెన్ జామీ!

కవికి ముఖ్యముగా కావలసినది యానందము. అట్టియానందమే తానుసందర్శించు ప్రతివస్తువునందు గ్రహించుచుండును. భావగాంభీర్యముగలిగి, నిరర్థపదములులేక యుండు రచనకవిత్వమున కొకవిధమైనరామణీయకము మాధుర్యము, మొదలగుగుణముల నొసగూర్చును.

గీ॥ "పూలబిడ్డల ప్రీతి నుయ్యాలలూపు
పవనను డెరుగడులో దినములువదలననుచు
తలపులకువిరుద్ధములగు ఫలితములకు
బాధ్యతెవ్వరో! పుణ్యపాపమ్ములేవో!"

ఇందుగల పదపరికరము మిక్కిలిస్వల్పము, అవ్యయమతిసులభము. పాదపూరణమునకు దెచ్చిపెట్టుకొనినపదములుకానరావు. భావమోయున్నతము. తానుతోడిమల వదలచేయుచున్నానను,సంగతిదెలియక యోపవను నాపూల బిడ్డలను ప్రీతిమెయి నుయ్యాల లూపుటను జూచి కవియొక గుణపాఠము నేర్చుకొనుచున్నాడు. ఇందుకవికిగలప్రకృతి పరిశీలనానైపుణ్యము తానుదర్శించినదృశ్యములనుండి యొకనీతి, పాఠకులకుబోధించుచాతుర్యము మిక్కిలిప్రశంసనీయము. అదియునుగాక, కవనము తద్దచనాకాలమునందలి నాగరికతను, నాటివారలసాంఘికజీవనము ఆచారవిచారములు మొదలగు విషయములు ప్రతిఫలించునద్దమువంటిని. స్వారోచిషమను సంభవకావ్యపాఠకుడు నాటిగృహస్థాశ్రమ

౹—వ పేజి మొదటికాలంక్రిందచూడుడు

## సంస్థాన వార్తలు

## కాశ్మీరసంస్థానములో ముసల్మానుల ఆందోళన

శుక్రవారము ప్రార్థనలసమయమున మసీదులో చేరిన ౨౦ వేలమహమ్మదీయులు కాశ్మీరు పడకపై శ్రీనగరుజెయిల్లో యిటీవల చెరసాలలో జరిగినదానివిషయమై తాము కోరినకోర్కెలను అంగీకరింపనందుకు తమ అసమ్మతి దెలుపుటకు సాయంత్రము నాలుగుగంటలకు అమీరిమిస్లి టుగలాం హైదరీగారి నాయకత్వమున పూంచీనుండి బయలుదేరిరి.

ఈసంగతి కాశ్మీరప్రభుత్వమునకు లోబడియున్న పూంచిసంస్థానమునుండి తెలియగానే మరికొందరుసైనికులు పంపబడిరి.

కాశ్మీరప్రభుత్వమువారు ఈక్రిందిప్రకటన గావించినారు:—

నిన్న జూన్ ౨౬వ తేదినాడు శ్రీనగరులో దొమ్మిజరిగెను. క్రిమినలుప్రొసీజరుకోడ్డుగరరవ సెక్షనుక్రింద గావింపబడిన ఉత్తరువును లంఘించుచు పెద్ద మహమ్మదీయులగుంపు ఒకటి ఊరేగెను. ఆఊరేగింపు జరుగకుండచేయుటకును, జనులనుచెదరగొట్టుటకును పోలీసుఏర్పాటులుచేయబడియుండ ఆపోలీసులపై రాళ్లు రువ్వబడెను. దాదాపు ౩౩ మందిపోలీసులకు గాయములుతగిలెను. ఒకపోలీసులారీ రెండుకునుపనికిరాకుండ పాడైపోయెను. రెండుస్థలములలో పోలీసులు కాల్చవలసివచ్చెను. లాఠీప్రయోగము చేయవలసివచ్చెను, దుండగములు చేసినవారిలో నొకడుమరణించెను. ఒకనికి బలమగుగాయములాయెను. ఊరేగింపునాయకుడగు మీర్ వెయిజ్ యుసుఫుషాయు, మరి ౫ గురు పట్టుకొనబడినారు. కొట్లాటలు జరిగినప్రదేశములో పోలీసుకట్టుదిట్టములు చేయబడెను.

## దక్కనుసంస్థాన ప్రజలమహాసభ

ఇటీవలకు మడికిరిలో కే-యప్పు- నారిమన్ గారి అధ్యక్షతవజరిగిన దక్కన్ సంస్థానప్రజామహాసభకు హైదరాబాదు సంస్థానప్రతినిధులుగ పూనానివాసియగు రాఘవేంద్రరావుశర్మగారితోకలిసి నలుగురు పోయియుండిరి- హైదరాబాదు సంస్థానమునకు సంబంధించిన తీర్మానములుకొన్ని సభవారిచే ఆమోదించబడెను- వామన్ నాయక్ గారి మరణముపట్ల విషాదమును ప్రకటించు తీర్మానమొకటియు, వాక్స్వాతంత్ర్యము సభాస్వాతంత్ర్యము మున్నగు పౌరస్వత్వపుహక్కులకోరు తీర్మానమొకటియు, తుల్జాపుర్కర్ తాతాచారిగారల బహిష్కారమునకై విచారమును పశ్చాత్తాపమును సూచించు తీర్మానమొకటియు, హైదరాబాదు శాసనసభను విస్తరింపజేయుటకై ద్యాగారి చిత్తుశాసనమును బలపరచు తీర్మానమొకటియు, హైదరాబాదులో భూములసంబంధములైన విషయములను రికార్డుచేసి యుంచుపద్ధతి నవలంబించవలెనను తీర్మానమొకటియు, వారసత్వపుహక్కులనుగూర్చి శ్రద్ధవహించవలెనను తీర్మానమొకటియు, జాగీర్లలో అక్రమములను గమనించుటకై నిజాంప్రభుత్వమువారిని కోరుతీర్మానమొకటియు ఆమోదించబడినవి.

—హైదరాబాదు బులెటిను

## బికనీరు మహారాజుగారి సువర్ణోత్సవపు వసూళ్ల భారము

కాంగ్రెసు స్థాయిసంఘ కార్యాలయమునకు ప్రజలమొఱ

పండిత జవహరలాలు నెహ్రూగారు యిట్లు ప్రకటించుచున్నారు:-

బికనీరుసంస్థానములో ప్రజామండలికార్యదర్శి అధ్యక్షులగు లక్ష్మీదాసు, మగరాముగార్లను సంస్థానమునుండి వెడలిపొమ్మని ఉత్తరువుచేసినట్లు ౧౯౩౭ మార్చినెలలో నాకు తెలియజేయబడినది. ప్రజామండలిచర్యల నరికట్టుటకు ఉత్తరువులుద్దేశింపబడినవి. చాలసారు అక్రమ-దియిబ్బందులనుగూర్చి మాకార్యాలయమునకు మొఱలువచ్చినవి. మేము విచారింపగ అవి నిజమేయని తెలియుచున్నది. కావున ముందుగ సంస్థానాధికారులకు తెలుపనిది వాటినిగూర్చి పత్రికలలో ప్రకటింప దలచుకొనక ౧౯౩౭ ఏప్రిలు ౨౧వ తేదీన సంస్థానపు ప్రధానమంత్రికి నేనొకలేఖవ్రాసి ఈఫిర్యాదులనుగూర్చి తెలిపి అవి యెంతవరకునిజమో తెలుపగోరితిని. నాలేఖఅందినట్లుగా జవాబేరాలేదు. అందుచే ఈఫిర్యాదులనుగూర్చి పత్రికలలో ప్రకటించుట అవసరముగతోచినది. ప్రధానికి నేను యీదిగువరీతి వ్రాసియుంటిని:—

ప్రజలహక్కులగూర్చి ముటుంచి, సంస్థానములో నిరంకుశాధికారములు, న్యాయము సంగళజరుగకుండుట, వల్లమందుఖర్చు, బానిసత్వమింకనుండుట — వీటినిగూర్చి ప్రత్యేకముగ తెలుపగోరెదను. పన్నులభారము పేదవారిపై నధికముగగలదు. ఇవి చాలకాలమునుండియున్న ఫిర్యాదులు. ప్రస్తుతము మహారాజుగారి సువర్ణోత్సవముసందర్భమున వసూళ్లనుగూర్చి ప్రజలు చాలబాధపడవలసివచ్చుచున్నది."

నెహ్రూగారి ప్రకటనయందు ప్రధానికి ఏప్రిలు ౨౬వ తేదీన వ్రాసినలేఖ నకలుగూడ గలదు. అందు ఈదిగువవిషయములనుగూర్చి సూచింపబడెను.

1. న్యాయవిచారం అందరికి సరిసమానముగలేకుండుట! ౨ వల్లమందువాడుక. 3 బానిసత్వము, ౪ పౌరస్వత్వపుహక్కులు నశించుట, ౫ జెయిళ్లలోహింస, దుర్వ్యయము, ౭పన్నులు, ౯ సువర్ణోత్సవము. — —

## హరిజనులకు దేవాలయ ప్రవేశ మిప్పించుటకై మైసూరు ప్రభుత్వాలోచనలు

బెంగళూరు, జూన్ ౨౬.

ముజారీపరిపాలనక్రిందనున్న హిందూదేవాలయములలో హరిజనులకు ప్రార్థనలుసలుపనిచ్చుటకు ఒక ఉపసంఘ మేర్పరచువిషయము విచారింపబడునని నేడు మైసూరుశాసనసభలో ప్రశ్నోత్తరములసమయమున ప్రభుత్వసభ్యుడు చెప్పెను. ఈ ప్రత్యుత్తర మొసంగబడినతర్వాత అనేకములుగా అనుబంధప్రశ్నలు వేయబడెను. ఆరుసెలలనుండి విచారింపబడుచుండినను యింకను ఈవిషయము తేలలేదాయని ఒకసభ్యుడడిగెను. ప్రభుత్వసభ్యుడిట్లు చెప్పెను. "ఈసమస్య అనేకతాత్పర్యములను గూడియున్నది. కనుక విచారించుటకు యికకొంతకాలము కావలసియున్నది.


కృష్ణునిగురించి మాకు దిగులుగాయుండెడిది.

ఆ పెద్దపిల్లవాడు తిరిగి చివరబడుట చూచితిరా
వారు కృష్ణునిగురించి మాట్లాడుచున్నారు.
ఆతడీమధ్య చాలా చికాకుగానున్నాడు. మనము ఆతనినిడాక్టరుయొద్దకు తీసికొనిపోవలెనని నా అభిప్రాయము
బిడ్డలు ఎదుగునప్పుడు బలమంతయు ఖర్చయిపోవును. ఇంకేమియు మిగులదు. కృష్ణుడు నీరసమువలన బాధపడుచున్నాడు. కనుక హార్లిక్సు వాడుడు.
కృష్ణా! ఇదిగో హార్లిక్సు.
బలే! శేషు ఎక్కువగా యిచ్చెదరా!
బలే!
కృష్ణుడే మొదటివాడిగా గెలుపొందెను

హార్లిక్సు ఎక్కువ శక్తినిచ్చును

పెరుగుచున్న పిల్లలు ఎల్లప్పుడూ తమశక్తిని నాటలాటలలోనే గాక పెరుగుటలో ఖర్చుపెట్టుచుయుందురు. ఈశక్తినితిరిగి వేగముగా సమకూర్చనియెడల వారు నరముల బలహీనతకు లోబడిపోవుదురు.

హార్లిక్సు ప్రతిదినయమును, రాత్రి పరుండబోవునపుడు యిచ్చినయెడల, వారి జీవితశక్తి నభివృద్ధిచేయును. పిల్లలకు సానిరుచి చాల సంతృప్తికరముగానుండి శక్తిని ఉత్సాహము నభివృద్ధి చేయును.

ఒకక్షణములో చల్లగాగాని, వేడిగాగాని, రుచియైనహార్లిక్సుతయారు హార్లిక్సుమిక్సరుతో చేయవచ్చును. స్టాంప్సులోను పోస్టుబాక్సు 2229 కలకత్తాలోను 14 అణాబిళ్ళలు పంపినచో సమను.

హార్లిక్సు

### అబిసీనియా దేశ సంస్కరణకై ఇటలీ ప్రభుత్వమువారి ౬ సంవత్సరములసూర్పు

రోమునగరములో జూన్ ౨౧వ తేదీవాడు ఇటలీమంత్రివర్గమువారు సమావేశమై అబిసీనియా అభివృద్ధికై ఒకవిధానమును ఆమోదించిరి. దేశమునంబడంతటను రోడ్లువేయుట, ప్రత్తి పంటను అభివృద్ధిచేయుట మున్నగుపనులు ఈవిధానమునసూచింపబడినవి. ౬ సంవత్సరముల కాలములో ఈవిధానమునునుసరించి అన్నిపనులు ముగింపబడును. ఈ ౬ సంవత్సరముల కాలములో ఇందుకుగాను ౧౨౦౦కోట్లలీరాలను వ్యయపరుప తీర్మానించుకొనిరి. (లీరాఅనునది ఇటలీ వాణ్యము. ప్రస్తుతప్రమారకపురేటు ౭౮ పౌనుకు దాదాపు ౯౨ లీరాలు.

---

### అంతర్జాతీయ కార్మికమహాసభ కార్యవర్గము

జెనీవా జూన్ ౨౩

అంతర్జాతీయ కార్మిక మహాసభ కార్యసంఘమునకు భారతదేశపుయజమానుల ప్రతినిధిగ జోషీగారు సభ్యులుగఎన్నుకోబడిరి-

---

### భారతీయులకు ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారి గౌరవబిరుదములు

లండన్: జూన్ ౨౩

సర్ అక్బర్ హైదరీ, సర్ అబ్దుల్‌రహీం, సర్ తేజబహాదుర సప్రూగార్లకు ఆక్సుఫర్డువిశ్వవిద్యాలయమువారు డాక్టరు ఆఫు సివిలు లా అను బిరుదములనొసగిరి-

---

## సరిహద్దు పోరాటము

జూను ౨౪వ తేది

రజ్‌మక్ బ్రిగేడు ౨౨వ తేది బానర్ బ్రిగేడుసహాయములో టోర్వం ప్రాంతమునకు వెళ్లెను. బిన్ను బ్రిగేడు ఉదయమున ౨౪ గంటలకు స్కురపంగినశిబిరము చేరెను. మొదట కొండజాతులవారు కొందరువీరిని ఎదిరించిరి. క్రమక్రమముగా వీరిసంఖ్య హెచ్చెను. ఆప్రాంతమున అడవులుదట్టముగానుండెను. సాయంకాలము ౫గంటలకు రజ్‌మక్ బ్రిగేడు టోర్వంచేరెను. ఈలోగా బన్ను బ్రెగేడు ముందుగా అనుకొన్నరీతిగా చెల్వేషికొంపు చేరిరి. దక్షిణ వజీరుస్థానము స్కౌట్లు రాత్రికిషర్వంగివద్ద క్యాంపులోమకాము చేసిరి. పగలు కొండజాతులవారు తుపాకులనుప్రేల్చిరి. జూను ౨౨వ తేది రాత్రి చెల్వేషిశిబిరములో జరిగినపోరాటమున ఒకసైనికుడు చనిపోయెను. సరిహద్దు పోరాటమున సిన్న ప్రభుత్వసైన్యమున ఏడుగురుచనిపోయిరి. ౩౮మందికి గాయములుతగిలెను. ౨౫౦ మందికిపైగా కొండజాతులవారు రజ్‌మక్ బ్రిగేడునుఎదిరించిరి.

సిమ్లా, జూను ౨౭

౨౩వ తేదీజరిగిన యుద్ధములో ప్రభుత్వసేనలు రాజ్మకు బ్రిగేడుజట్టుటూరువనుకిపోవుచుండగ సేనలోఒకరుచంపబడిరి. ముగ్గురు గాయపడిరి. భారతీయో ద్యోగి గాయపరచబడిరి- ఆనాడు శత్రువులలో ౩౩గురు చంపబడిరి. ఆరాత్రిబన్ను బ్రిగేడు శిబిరముపైన, షేర్వంగినారాయియందు వజీరుస్థాను స్కౌటులపై రహస్యముగతుపాకులు కాల్చబడెను. ౨౪వ తేదీన బన్ను బ్రిడ్జిజట్లు చెల్వస్టినుండి టూరువాను చేరెను. షేర్వంగినరాయిపడమర శత్రువులెదురొగ్గనిరి. కాని వారిలో ౨౦ మందినిచంపి ప్రభుత్వసేనలు దాటిపోయినవి.

సిమ్లా. జూన్ ౨౭

రజమక్‌వద్ద జూన్ ౨౪, ౨౫ తారీఖులలో ప్రభుత్వసైనికులమీద సరిహద్దుజాతివారు పడిరి. బ్రిటిషువారిపక్షమున నెవ్వరును చనిపోలేదు జూన్ ౨౫తారీఖురాత్రి రాజ్‌మక్, బన్నుబ్రిగేడ్లును, సౌత్ వజీరిస్థాన్ స్కౌట్లున్న టోర్వామ్‌నుండిబయలుదేరి చల్వేస్టీరోడ్డుమీదికిపోయిరి. కొద్దిమంది సరిహద్దుజాతులవారు అచ్చటచ్చటనుండిరి. కానివారు పోరాడలేదు తరువాతసైనికులు జయముచేకొని టోర్వామ్‌తిరిగివెళ్లిరి. ఎవ్వరునుచావలేదు. జూను ౨౫వ తారీఖున బూబా బ్రిగేడు సార్పికైలోనుండెను.

ఇటీవల సరిహద్దుజాతులపై రాజకీయశాఖవారుచేసిన ఒత్తిడిమూలముగా ఒక్కరుతప్ప అపహరింపబడినవారందరు తిరిగి యిచ్చివేయబడిరి. మే ౨౧,౨౨ తారీఖునుండి పెటేల్లు జిల్లాలలో అపహరింపబడిన వారెవ్వరునులేరు.

---

### సర్. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి రాక

ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమున ప్రాచ్యవేదాంత శాస్త్రోపాధ్యాయులుగనున్న సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ జూలైనెలలో భారతదేశమునకు వచ్చెదరు. భారతదేశమున రెండుమూడునెలలున్నతరువాత మరలఆక్సుఫర్డునకు వెళ్ళెదరు.

---

### రాయల్ ఏషియాటిక్ సొసైటీకి నిజాం ప్రభువుగారు ౨౦౦ ప్రాచీనఅరబ్బీ గ్రంథముల నిచ్చుట

లండన్: జూన్ ౨౪

సహాస్ముకీయుశకము మూడవ శతాబ్దమునాటి ౨౦౦ అరబ్బీగ్రంథములను హ.ఘ.హ నిజాంగారు ముద్రింపించియుండిరి. ఈనూరుగ్రంథములను నిజాముగారు లండనులోని రాయల్ ఏషియాటిక్‌సొసైటీకి బహుమతిగ నిచ్చిరి. ప్రాచీనగ్రంథములవిషయమై ఈసంఘమువారు గావించుచున్న పరిశోధనలనుగూర్చి తమసంతృప్తినిసూచించుటకై ఈబహూకరణజరిగినది. నిజాముగారిపక్షమున నేటిదినము సర్ అక్బర్ హైదరిగారు ఈగ్రంథములను సంఘమువారికి సమర్పించిరి. సంఘపుఅధ్యక్షులగు హెయిలీ ప్రభువుగారు కృతజ్ఞతతో అంగీకరించిరి.

---

### పంజాబు సైనికశాసనపుఖైదీల విడుదలకై ప్రధానమంత్రియాజ్ఞ

సిమ్లా: జూన్ ౧౫

పంజాబుసైనికశాసనపు ఖైదీల విడుదలకై ప్రధానమంత్రి కొంతకాలముక్రింద నే ఉత్తరువుచేసినను, వారువిడుదలగుటకు కొంతకాలముపట్టునని జైళ్లయిన్స్పెక్టరు జనరలుగారనిరి- జెయిళ్లకుఉత్తరువులు అందియుండినను ఖైదీలువేరువేరుతావులందు యావజ్జీవశిక్ష ననుభవించుచున్నారు గావున, అన్నిచోట్లకుఅందజేయుటకు కొంతకాలమగునని తెలిపిరి. అనేకఖైదీలు అండమానుదీవులందున్నారు.

---


## భారత్ యిన్షూరెన్సుకో, లిమిటెడ్

## నోటీసు

వ్యాపారమును. ఉద్యోగస్థులును ఎక్కువైనందున పబ్లికుగార్డనురోడ్డు హైదరాబాదులోయున్న మాఆఫీసు 1 జులై 1937 నుండి శికింద్రాబాదు 61 జమ్స్ స్ట్రీట్ క్విలెక్ బ్యాంకు భవనమున పైభాగమునకు మార్చబడినది.

మాయొక్క ఏజంట్లు, ఇన్స్పెక్టర్లు, పాలసీదారులు మొదలయినవారు యీవిషయమును గమనించగలరు.

టెలి { గ్రాం — భారత్ / ఫోను — 827 }

ఆర్. యస్. అయ్యర్ బ్రాంచి సెక్రటరీ



## కావలయును

ఈరాష్ట్రములో ప్రతిజ్ఞాకును నిపుణులైన మంచీకమిషన్ ఆర్గనైజర్లు కావలయును. నైతే అనే వ్యాపారమును శారంచేయువారలకు ఇత్తాయిన్వాబడును. చాల ఉపాయము క్షతులు. బాగుగా పనిచేయువారికి మంచిఖ్యాతి. వెంటనే దరఖాస్తు చేయుడు.

నాగపూర్ ఫైసిక్ యిన్షూరెన్సు కంపెనీ లిమిటెడ్

నాగపూర్ ౨౪కి.



## వచ్చి యున్నది.

స్థాపితము 1884 — మైసూరు మహారాజాగారి కృపా పోషితులు — స్వర్ణోత్సవము 1934

## గుబ్బి శ్రీ చెన్న బసవేశ్వరస్వామి సంగీత మండలి. రిజిష్టర్డు మైసూరు

హైదరాబాదు పుత్లిబౌలి సమీపమున వారి స్వంత ధనలక్ష్మీ థియేటరులో

# కురుక్షేత్ర లేక భగవద్గీత

(కన్నడములో)

ప్రతిదినము 9-30 ఘంటలకు ప్రారంభింపబడును

| | | |
|---|---|---|
| 1—7—37 | గురువారము | కురుక్షేత్ర |
| 3—7—37 | శనివారము | కురుక్షేత్ర |
| 5—7—3 | సోమవారము | కురుక్షేత్ర |

7—7—37 బుధవారము సదారమ

8—7—37 గురువారముసంపూర్ణ కృష్ణలీలలు

కృష్ణలీలలలో తిరిగి కురుక్షేత్రముచూపబడదు-

## వినోదరత్నాకర జి. హెచ్. వీరన్న గారు

## స్వయముగా

వీరిఖ్యాతికు కారణములైన వేషములన్నియు ధరింతురు. ఇటి నటకోత్తమునను చూచియుండరు. ఇకముందు చూడబోరు- తరుణము మించిన విచారించి లాభములేదు.

**సదారమలో ఆదిమూర్తి యను కోమటి వేషమును మైసూరు గజదొంగ వేషమును కృష్ణలీలలో మకరందుడను బ్రాహ్మణవేషమును ఫిడిల్ వాయించువాని వేషమును ఫైల్వాన్ వేషమును ధరింతురు.**

అందరి ప్రోత్సాహము కావలయును

యస్. పి. నరసింహమూర్తి ఎం. ఏ.
మేనేజర్

వినోద రత్నాకర
జి. హెచ్. వీరన్న
హాస్యకళానిధి ప్రొప్రైటర్



## వీర్యస్తంభనరసాయనము

5 గంటలు వీర్యము ఆపును.

అనేక వనమూలికలు, విలువగల్గిన భస్మములచేతను తయారుకాబడినది నీరైన వీర్యమును ఘట్టిపర్చి మూత్రములోపోవుట, అతిశీఘ్రస్ఖలనము ఆపి అసలు స్త్రీసాంగత్యమేలేని నపుంసకులకుసహితము లింగనరములు పుష్టిచే లింగము లావు, పొడవు, బలిష్ఠముగలిగి స్త్రీనిజూచినంతమాత్రమునేనే విశేషము కామోద్రేకములుకలిగించి ౪-౫ గం టలవరకు, వీర్యస్ఖలనకాకుండ అపుడేని తృప్తిదీరునట్లు సంభోగ సౌఖ్యము యిచ్చుటకు గ్యారంటీ. మందు రెండుతోలన.ఒకడబ్బి రు, ౫-౦-౦ వి. పి. ఖర్చు ౦-౬-౦ శాంపిలుగాని విడిగాఆర్డబ్బీలుగానివొసుగబడవు. నిజము పరీక్షించండి.

డాక్టర్ రత్నంబ్రదర్సు మెడికల్ హాల్ ౨౫౨- బి పలకపేట, హైదరాబాదు.

౫ వ పేజీ తరువాయి

## మురుగు నీటి ఉపద్రవము—కలరా బాధలు

సనాతనులకును ఆర్యసామాజికులకును సంఘర్షణ

నిజామాబాదులో స్థాయిసంఘ ప్రచారకునిచే ఆంధ్రోద్యమప్రచారము

### వీధిబడులు

ఇచటవీధిబడులు దాదాపు ౩౦ గలవు. కొన్నిటియందు,ఆంధ్రము, హిందీ, ఉర్దు నేర్పబడు చున్నది. కొన్నిటయందు ఆంధ్రము, హిందీ, మహారాష్ట్రము నేర్పబడుచున్నది. ఉపాధ్యాయులు వెనుకటిపద్ధతిపైననే బోధజేయుచున్నారు. జిల్లాసంఘమువారు పై పాఠశాలలను తమస్వాధీనము చేసుకొని విద్యార్థులకు కొంతి కాలములోనే ప్రపంచజ్ఞానము గలుగునట్టి విద్య నేర్పు ప్రబంధము జేసిన బాగుండునని తోచుచున్నది.

### పారిశుద్ధ్యము

ఏమూలచూచినను, ఏవీధిచూచినను, మురుగుడు కాలువలతో నిండియున్నవి. ఇచట లోకల్ఫండుశాఖవారు ఈవిషయములో ఏమిచేయుచున్నట్లుగాని కనపడదు. విద్యావంతులగు ప్రజలలోను శ్రద్ధ కానరాదు. ప్రస్తుతముకలరా వ్యాధివలన ప్రజలు అచటచట చనిపోవుచున్నారు. జిల్లాసంఘమువారైనను మూకీభావము వహించక ప్రజలఆరోగ్యమును గాపాడు ప్రయత్నములు చేయుట ముఖ్యధర్మము.

### వైషమ్యములు

ఇచట హిందూప్రజలలో దినదినము కక్షలు పెరుగుచున్నవి. ముఖ్యముగా, ఆర్యులు,సనాతనులను, వారు ఒకరినొకరు ద్వేషభావములతో జూచుకొనుట నేనుజూచియున్నాను. జిల్లా ఆంధ్రసంఘనాయకులు ఇట్టి వైషమ్యముల రూపుమాపుటకు గట్టి ప్రయత్నము జేయుట మంచిది.

* * * *

## సర్కారిబస్సులుప్రయాణీకులతిప్పలు

ఆసిఫాబాదు:అమర్దాదు౩

ఈజిల్లాలోచేరిన తాలూకా బోథ్ నుండినిర్మలకుయిదివరలో మూడుబస్సులు నడచుచుండెడివి. కాని ప్రస్తుతము రెండే! ప్రయాణీకులు ఎక్కువ.సగమునకొద్ది ప్రయాణీకులు చాలాచిక్కులపాలగుచున్నారు

## ఆరోగ్యము వైద్యము

## రోగికి ఉపచారక్రమము కలరా

నేదునూరు రంగారావుగారు
(పానగల్, జిల్లానల్లగొండ)

### వ్యాధి లక్షణములు

కలరా! అనగా వాంతి,భేది— ఈవ్యాధికలిగినవారికి తెలుపుపదార్థములు పరిమితమెన్నగా కనులకగుపడును ప్రవర్తులువిరిగిన పాలమాదిరిగ చిదుపులుచిదుపులుగా గంజివన్నె అకారపు నీటితో విశేషముగా పడిపోవుచుండును. వమనము పులుపుతోడను, వగరుగను కడుపున భారముకలిగించుచు వెడలుచుండును. దాహము విశేషముగానుండును. ప్రవర్తికిపూర్వ మల్పాచమానము నడువదు కాలుచేతులు తీపులుకలుగును. కనుగ్రుడ్లు లోనికిపుంజాను. ముక్కు సాగనారంభించును.

### ఇందుకు పుపచారక్రమము

వల్లమందు, మిరియములు, హారతికర్పూరము ఇవిమూడు సమాంశములుగా వాడదగును: కల్వమున ప్రథమమున మిరియాలువల్లమందు మెత్తగామర్ధించి హారతికర్పూరము ఘాటుజడకుండ గాలిరానిగదిలో పైమర్ధించిన కల్వమందు కలిపి యీ మూటిని బాగుగా జలముచే మర్ధించి జొన్నగింజ ప్రమాణము గామాత్రలుగట్టి ఒకసీసాలో భద్రపరచవలయును వ్యాధిగనుపించినతోడనే ఒకమాత్ర తినుటకివ్వవలయును, ఇట్లుగంటకు ఒకమాత్రయిచ్చుచు వచ్చినయెడల వాంతియైనను లేక భేదియయినను అనగా రెంటిలో ఒకటి మాత్రముకట్టును. అట్టితరి రెండుగంటలకొకమాత్రచొప్పున యివ్వవలయును ఒకవేళ్ల వాంతిప్రవర్తులు రెండుకుడిగి కడుపుబ్బి, శ్రమకలిగినచో చలిబూడిద (అనగా నిప్పటిపిడుకబూడిద)లో హారతికర్పూరము రూపాయికి అర్ధభాగము అనగా ముప్పదిరెండవభాగము కలిపి శరీరాద్యంతము నీబూడిదపూసి గొంగడి చింటాకప్పవలయును. వేపకాయలోని పప్పును బాగుగానూరి ౪ గుంజల ప్రమాణము ముద్ద కడుపులోకిచేయవలయును. దీనివలన అల్పాచమానము జారీఅయి కడుపుబ్బుతీరి శ్రమ నివారించును, చింతపండుచారుతో అన్నమతినవలయును. వ్యాధికనుపించిన వేళ దాటినతోడనే ఇతరదోషములేనియు కలుగకుండుటకు రెండుపర్యాయములు సాయం ప్రాతఃకాలములయందు, అగ్నికుమారమును పూట ఒకటింటికి రెండుగుంజలప్రమాణముగా చల్లనినీటితో యివ్వవలయును. ఈఅగ్నికుమారౌషధపు క్రియ నీదిగువనుదాహరింపబడును.

శ్లో॥ రసేంద్రగంధం సహటంకణేన
సమంవిషం వోర్యమిదంత్రిభాగం
కపర్దికాశంఖౌవ పిచత్రిభాగం
మరీచచూర్ణాఘుగుణం విదధ్యాత్
సుపక్వజంబీర రసేనగృష్ట్వా
శుద్ధోభవేత్యగ్ని కుమార ఏషః
విషూచికారోచక సన్నిపాతే
దేయం ద్విగుంజంయదివ్యాప్యజీర్ణే
శ్రీపర్ణఖండేనయథాబలంచ
శీతంజలంచాప్పి చేతువీరంతుః.

పై శ్లోకానుసారముగా ఔషధమును వైద్యునిద్వారా చేయించి తీసుకొని పుచ్చుకొనవలయును. తయారుచేసిన పై ఔషధరాజము మావద్ద సిద్ధముగానుండగలదు. కోరువారలకు పంపించబడును—

నోటు:—పసగ్రంథకద్రవ్యశుద్ధులకై వైద్యులచే ఔషధము చేయించుట కర్తవ్యము శుద్ధిక్రియలు తెల్పుటకు అధికముగా వ్రాయవలసివుంటుందని మనవి.

## ఫ్రాన్సులో మరల మంత్రివర్గము రాజీనామ

ఫ్రాన్సులో రాజకీయపక్షముల సంఖ్య అపరిమితమగుటచే ఏఒక్కపక్షమునకుగాని మంత్రిపదవిలో స్థిరత్వముండుటలేదు. ఈసారిబ్లుంగారి మంత్రివర్గము రాజీనామనీయవలసివచ్చినది. బ్లుంగారు ఫ్రాన్సుఆర్థికపునర్జీవనమునకు సర్వాధికారములనుకోరగా, శాసనసభలోనిచేంబర్ అఫ్ డిప్యూటీస్ అంగీకరించెనుగాని సెనేటుకొన్ని అధికారములనుమాత్రమే ఇవ్వగా చేయగలనని బ్లుంగారు మంత్రివర్గము అందుకు సమ్మతింపక రాజీనామనిచ్చెను. జనవరి 21 తేది నాడు రాజీనామయొసగబడెను.

### మైసూరు సంస్థానములో హిందీ ప్రచారము

మైసూరులో జూన్ ౨౧వ తేదిన హిందీ ప్రచారకసభవారి యాజమాన్యమున జరిగిన ౩డవహిందీప్రచారకసమ్మేళనముకడపటి సభకు శ్రీయుత సత్యమూర్తిగారు అధ్యక్షత హించిరి. మైసూరుప్రభుత్వము విశ్వవిద్యాలయము హిందీ ప్రచారమునకు తోడ్పడినందుకు అభినందించిరి.

కామినియా సాండల్ సోప్ రిజిష్టర్డు

హిందూదేశమునకు ఆదర్శప్రాయమైనసబ్బు. మీ క్కలికోమలమైన చర్మమును ఉష్ణదేశముయొక్క వాతావరణమునుండి రక్షించుటయేగాక చర్మము సంపూర్ణముగశుభ్రపరచి ఉల్లాసకరమైనట్టియు,కోమలమైనట్టియుగంధపుచెక్కయొక్కసువాసన మీల్చును వెల 3 బిళ్లలుగలపెట్టె 1కి అణాలు 14. ఖర్చులు వేరు.

అర్ధణాస్టాంపువంపిన మాదిరిఉచితం పంపబడును-

ఆడ్సను సైప్రస్ సైసాల్ (రిజిస్టర్డు

జలుబును, మేహవాతనొప్పులను

తప్పకకుదుర్చు ఔషధము

జలుబును ఎప్పుడును నిర్లక్ష్యముచేయకుడు. సువాసనగల ఈసాల్వును మెడకు, రొమ్మునకు, భుజములకును మర్దించినయెడల తప్పక ఉపశమనము కలుగును ఆరంభదశలో ముక్కుమీదకొంతపూసి పరిశుభ్రపరుచు దీనివాసనను చూడవలెను. మేహవాత నొప్పి నివారించుటకై నొప్పులున్నచోట మర్దించినయెడల సైప్రస్ సాల్వ్ చిన్నచిన్న రంధ్రములద్వారలోపలప్రవేశించి వెంటనే నొప్పిని, పట్టునుతగ్గించును.

ఎల్లచోట్లలో దొరుకును— వెల బుడ్డి 1కి రు. 1-0-0. వి.పి. ఖర్చులు వేరు.
3 బుడ్లకు రు. 2-8-0

2 అణాలు పోస్టుబిళ్లలుపంపినచో శాంపిలు ఉచితముగాపంపబడును.

సోల్ ఏజెంట్లు:— దిఆంగ్లో యిండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ, బొంబాయి 2.

బలపపురాతి సున్నము

యొక్క ప్రఖ్యాతి దాని మంచితనమనే అద్దములో గానవగును.

బలపపురాతి సున్నముచే నేయబడినకప్పు తక్కువలోతక్కువ నూటికి ౨౦వంతులు చౌకపడును.

ఘట్టితనము మరియు కట్టడపు సౌకర్యములలో నూరురెట్లుయెక్కువ.

మా గోదాములో చూచి పరీక్షించుకొనవచ్చును.

1 కప్పుమీద నీళ్ళు నిలిపి చూడుడు. 2 బరువువేసి చూడుడు.

హైదరాబాదు మార్బుల్ వర్క్సు
హైదరాబాదు-దక్కన్.

Saba

నిజామాబాదు: అమర్దాదు౩

ఈగ్రామము నుండినిర్మలకువెళ్లు బస్సులుచాలా చిన్నవి.అందుచేతస్థలముచాలక చాలామంది అవసరమగు కార్యములలో నష్టపడుచున్నారు బస్సుఉద్యోగుల చర్యలవిషయమైకూడా ఫిర్యాదులు చేయుచున్నారు.

# స్పెయినులో యుద్ధము

బిల్బావునగరములో ౧౭ వేలమంది బాస్కు సైనికులును విద్రోహులచే ఖైదీచేయబడిరి. సైనికులు ఎట్టిఘోరములు చేయకుండ ఫ్రాంకోగారు కఠినశాసనము చేసిరి. ప్రభుత్వమువారే నగరము చుట్టునున్న ఇంకా ౬ బ్రిడ్జీలను ధ్వంసము చేసియున్నారు. ఫ్రాంకోగారు కొన్నిమాసములనుండి ఖైదీలుగానున్న ౧౫౦౦ మంది విద్రోహులను విడుదలచేసిరి.

బిల్బావునగరమును స్వాధీనపరచుకొన్నందుకు అభినందించుచు జనరల్ ఫ్రాంకోగారికి ముసోలినీ, హిట్లరుగార్లు సందేశమంపిరి. బిల్బావుపతన వార్త మాడ్రిడులో విద్రోహుల కుత్సాహమొసగెను.

కాని ఇంగ్లాండులో సౌదాంప్టను రేవు నగరమునందున్న ౫౦౦ మంది బాస్కు బాలురు జూన్ ౧౯ శనివారమునాడు రాత్రి బిల్బావునగరము శత్రువుల స్వాధీనమైనవార్త వినగానే భీతిల్లపడి పారిపోయిరి. పోలీసువారు రాత్రియంతయు అడవులనువెదకి బాలురను మరల క్యాంపులోనికి తీసికొనివచ్చిరి. వీరిలో పెద్దవారు మరల స్పెయినుకుపోయి తమతండ్రులకు సహాయపడవలయునని ఆందోళనతోనున్నారు.

బాస్కు సైనికులు బిల్బావునగరమును వదలిపోవుటకుముందు కొన్ని బాంబులను నగరమునందు అచ్చటచ్చట రహస్యప్రదేశములందుంచిపోయిరి. వారుపోయినంతటనే ఈబాంబులు ప్రేలునట్లు తయారుచేయబడినవి- కాని విద్యుచ్ఛక్తి అంటకున్నచో అవి ప్రేలవు- ఈరహస్యమెరిగినది విద్రోహులు విద్యుచ్ఛక్తిని రాకుండ నిరోధించిరి- ఇట్టిబాంబులకై ఇంజనీరులు ఇండ్లను గొడౌనులను పరిశీలించిరి-

జూన్ ౨౧ వతేది కామన్సుసభలో ఒక సభ్యుడు అడిగినప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచు ఈడెనుగారు "బిల్బావురంగమున విద్రోహులు పయోగించినవిమానములు ఇటలీ, జర్మనీదేశములందు తయారుచేయబడినవని చెప్పుటకు సాకద్ధతగుఆధారములున్నవి" అనిచెప్పెను-

హెండే జూన్ ౨౩

తిరుగుబాటుదారులవశమైన బిల్బావునగరమున పరిస్థితులు సౌమ్యముగనున్నవి-

బాస్కు రాష్ట్రమునకు పశ్చిమముననున్న సాంటాండరు రాష్ట్రమును స్వాధీనపరచుకొనుటకై విద్రోహులు ప్రక్రమించిరి- బిల్బావునకు పడమట ౧౨ మైళ్లదూరముననున్న రెండుగ్రామములను స్వాధీనపరచుకొనిరి- ఈప్రాంతమున సేనానిగనున్న జనరలు డవిలాగారి క్రింద ౧౬౫ వేలమంది సైనికులు ౪౧౦ మరతుపాకులు, కొన్నిబండలు మరఫిరంగీలు టాంకీలు సిద్ధముగనున్నవి- త్వరితముగ సాంటాండరుదాడిని జరుప జనరలుడవిలాగారు నిశ్చయించుకొనిరి-

జనవరి ౨౩ వతేదివాటికి సాంటాండరుకు ఉత్తరభాగములలో కొద్దిగా పోరాటమారంభమాయెను- వెంటనే బ్రిటిషు ఓడలనేకములు యుద్ధములో పాల్గొనవారలను తీసికొనిపోవుటకు ప్రారంభించెను- సాంటాండరుకు పోవుటకుముందు ౨౬ వతేదినాడు త్రోవలోనుండు కొమ్మూర్రిడియేలిస్ పట్టణము చేరుటకు మూడు మైళ్ళదూరముననున్న సముద్రతీరమును చేరుకొనిరి- ఇట్లు బిల్బావునగర పతనానంతరము ఆ రాష్ట్రములో మరి ౫౪ మైళ్ళదూరపుప్రదేశము వశపరచుకొనబడెను- బిల్బావుపతనముతో మరల విద్రోహులదృష్టి మాడ్రిడునగరమును పట్టుకొనువిషయములో దిగినది- ఇప్పటికి రెండుమూడుసార్లు మాడ్రిడునుపట్టుకొనుటకై యత్నించి విద్రోహులు ఓడిపోయియున్నారు_జూన్ ౨౬ వతేది ఉదయము విద్రోహులు జరామ రణరంగములో ప్రభుత్వదుర్గములను పట్టుకొనయత్నించి భగ్నమనోరథులైరి- గుడలజార రాష్ట్రములలోను, మాడ్రిడునకు ఉత్తరభాగమునను విద్రోహుల సేనలు అధికముగనున్నవి-

బాస్కు రాష్ట్రములో ఘోరయుద్ధము జరుగుచున్నట్లు ఆశ్చర్యమునకు బాస్కులను పట్టుపెంపొక్కకని ఒక్కప్రవాహముగా పోరాటమును సాగించుకొనుండి వెడలిన ఒకక మ్యూనిక్కువల్ల తెలియుచున్నది- మరియు బిస్కే రాష్ట్రములోనుండు గనుల భూములన్నియు విద్రోహులవశమైనట్లు అదేకమ్యూనిక్కువల్ల తెలియుచున్నది- బిల్బావుపతనముచే విద్రోహులు ౧౫౦ లక్షలమంది ప్రజలపై పాలనాధికారము పొందినారు; ప్రభుత్వ పరిపాలనమందు ౧౬౭ లక్షలమంది మాత్రమే యుందురు-

## పంజాబులో వ్యభిచారులవలని ఘోరభయము

పంజాబురాష్ట్రములో ౧౯౩౫_౩౬వ సంవత్సరములో వ్యభిచారముకై ౬౦౩ మంది సొమ్ములకై ౫౭౮ మంది బాలబాలికలు ఎత్తుకొనిపోబడిరి. ఇటే ౧౯౩౬-౧౯౩౭వ సంవత్సరములో, ౧౩౭ మంది వ్యభిచారముకొరకును ౧౬౧ మంది సొమ్ములకొరకును ఎత్తుకొనిపోబడిరి.

## వినాయక దామోదరసవర్కరు గారికి ఘనసన్మానము

జూను ౨౫వతేది ఉదయము వినాయక సవర్కరుగారు దక్షిణమహారాష్ట్రసంచారము ముగించుకొని పూనాకువచ్చిరి- రైలు దిగినతోడనే వారికి పూలమాలవేసి వీధులవెంటదీసికొనిపోయిరి. సవర్కరుగారు స్వర్ణమారుతీదేవాలయమువద్ద నిలిచి దేవాలయముచూచి, తిరిగి శిలావిగ్రహమునకు పూలమాలవేసిరి. ప్రథమమున పూనాపత్రికారచయితలసంఘమువారు సన్మానమొసంగిరి.

సవర్కరుగారుమిత్రులతో సంభాషించుచు కాంగ్రెసువారినందరిని తాను విమర్శించినట్లు పత్రికలలోపడినవార్త అసత్యమని తెలిపిరి.

కొన్నిప్రశ్నలకు జవాబుచెప్పుచు, భారతరాజకీయరంగములోనికి సోషలిస్టుల ప్రవేశము అవసరమేననియు, వారు కాంగ్రెసు వైఖరిని శుష్కవాదములనుండి కార్యాచరణకు మార్చుటకు తోడ్పడుచున్నారనియు తెలిపిరి.

సాయంకాలము జరిగిన బహిరంగ సభలో సుమారు నూరుసంస్థలు వారిని సన్మానించుచు పూలమాలలు వేసెను. అనేకవేలమంది సభకువచ్చిరి. పురజనులతరపున సన్మానపత్రమొసంగబడెను. బొంబాయి ఆర్థికమంత్రియగు జమ్నాదాసు మెహతాగారు, మరికొందరు సవర్కరుగారి దేశసేవను కొనియాడుచు ఉపన్యసించిరి.

## జాతీయపతాకకు మాసికాభివందనములు

ఇటీవల సిమ్లాలోను పూనాలోను జాతీయపతాకను లాగివేసియుండుట దేశీయులలో అనేకుల మనస్సులకు కలిగినకష్టమునుగూర్చి అభిప్రాయమిచ్చుచు పండితజవహర్లాలుగారు, అలాగివేసినదెవరో అవివేకులైయుందురు గావ దానికి గొప్పప్రాముఖ్యముండజాలకున్నను, భారతీయుల స్వాతంత్ర్యాభిలాషకు చిహ్నమగు ఈపతాకకు ఎట్టిఅవమానమునుగాని సహింపకుండుట స్వాతంత్ర్యారాధకునిలక్షణమనియు ఇట్టి అవమానక్రియలు మున్ముందు జరుగకుండ చేయుటకు దానిపూర్వముకంటె ఎక్కువగ ఉపయోగించుచుండుట ఒకటేమార్గమనియు, చెప్పుచు ప్రతిమాసములో తుదిఆదివారము పతాకాభివందనోత్సవములను కాంగ్రెసుసంఘములు జరుపవలెననియు, అట్లుజరిపినసంగతిని కాంగ్రెసుస్థాయిసంఘకార్యాలయమునకు తెలియబరచవలెననియు సూచించుచున్నారు-

ఈసందర్భమున సిమ్లావార్తయొకటి ఉత్సాహకరముగనున్నది- అఖిలభారత చరఖాసంఘభవనమునుండి జాతీయపతాకను యూరపియుడొకడు లాగివేసినసంగతినిగూర్చి సిమ్లాలో ౨౫జూనునాడు జరిగిన పంజాబురాష్ట్రపు అసెంబ్లీ సమావేశములో దేశబంధు గుప్తాగారు అడిగినప్రశ్నకు ప్రధానమంత్రియగు సర్ సికందర్ హయత్ ఖాన్ గారు ప్రత్యుత్తరమొసగుచు జరిగినపనికి చాలవిచారమును ప్రకటించి, నేరస్థుని కనిపట్టుటకు యత్నములు జరుగుచున్నట్లును, అతడుచిక్కి నేరముఅతనిపై ఋజువైనచో అతనికి తగినశిక్షవిధింపబడుననియు చెప్పిరి-

## ఇష్తిహారు

యిష్తిహారు మహకమా సజానుతు ఆబ్కారి మునూలికు మహ.రానా సర్కారుఆలీ తా॥ ౧౮ అమర్దాదు సన్ ౧౩౪౬ ఫసలి.

బజరియ్ హాజా జాగీరుదారుసాహెబాన్ మక్తేదారుసాహెబాన్ మహాజె ముఖ్తజాతు జాగీరాత్ వ మహాజెముఖ్తజాతు ఆమదని సేంది యొక్క నుమ్వాంకిస్తున్న ౧౩౪౭ సాలు అదాయితారీఖు ౫ వ షహరేవరు స్న ౧౩౪౬ సాలునుంచి కాగలదు. చెక్కుల తక్సీము (౫) వ షహరేవరు స్న ౧౩౪౬ సాలు ఆదివారమునుంచి (౧౧) వ షహరేవరు స్న ౧౩౪౬ సాలు శనివారమువరకు యీ మహకమాలో అవుతువుండగలదు.

యేజాగీరుదార్లు అయితే చెక్కులు తీసుకునేకొరకు స్వంతముగ రాజాలరో వారలు తమతమ గుమాస్తాలు నవుకర్ల జర్యాన చెక్కులు తెప్పించుకొనవచ్చును. ఫఖ్తు.

హాస్బ్ తజవీజు యిజ్లాసు

సదద్గారు నాజం ఆబ్కారి


# మలబద్ధకము అరసిమొలలు

## రోగచిహ్నములు

సాధారణముగా ప్రపంచముననుండు వ్యాధులన్నిటికిని మలబద్ధము తల్లివంటిది. దానినుండియే తక్కిన రోగములు జనించుచున్నవి. అందులో మూలవ్యాధి ఒక మహాదారుణమగు భయంకరరోగము. మూలశంఖవ్యాధి (బవాశిర్) వలన అనేకమంది దేహారోగ్యమును గోల్పోయి, అన్నహితువులేక, మిక్కిలి బలహీనులయి అనుదినమును తీరనిబాధతో కాలము గడుపుచున్నారు. యిందులనేకరకములుకలవు. ఒక్కొకప్పుడుమలవిసర్జనమున రక్తముపడుచుండును. బాధ హెచ్చుగా నుండును మలము చిట్లముకట్టిపోయి గట్టిపడును. మలద్వారము చిట్లిఉండును. ఒకప్పుడు మొలలు లోపలకుండును- మనిషికి నిరంతరము మేకులుగుచ్చినట్లు రోగి బాధపడును. ఆ కారణమున విసుగు హెచ్చుగానుండును. ఏపనిచేయుటకును హెచ్చరిక ఉండదు. అయినను ఈవ్యాధినుండి మిమ్ములనుతప్పించి మీకు గోల్పోయిన ఆరోగ్యభాగ్యము జేకూర్చి మిమ్ములను సుఖవంతులుగా చేయగల్గు "పైలోసాల్"ను నేడెతెప్పించి సేవించుడు: యిందురసవిష గంధకాదులు ఏమియునులేవు. చిరకాల ఔషధ పరిచయమున సమకూర్చబడి మీకు అందజేయబడుచున్నది. ఏపదార్థములు లేక మీ జీర్ణకోశమునందు చిట్లముకట్టి పోవుచుండెనో అట్టిపదార్థములు యిందు చేర్చబడియున్నవి. అందుచేత యిది సేవించినంత ఆపదార్థ సహాయమున చక్కగా జీర్ణమయి, చిట్లముకట్టకుండచేసి మీకు కష్టములేకుండ విరేచనముచేయును.

## అతిసులభమైన అనుపానము

రాత్రిపూట పరుండబోవునపుడు ఒకటిరెండు చెంచాలు మందు వేడినీళ్లలో కలిపి నోటిలోకి సేవించవలెను అట్లుచేసినయెడల ప్రాతఃకాలమున కాలవిరోచనము యేబాధలేకుండ కల్గును. మరియు రక్తస్రావము, పోటు తగ్గిపోవును. పుండ్లుపడియున్న మలద్వారమునంతయు శుభ్రపరచి నెప్పిలేకుండచేయును. వాపుతగ్గును. శరీరతత్వము క్రమముగా మారిపోవును. అనుదినము యేబాధయులేకుండ విరేచనము సేయించును.

సీసా 1 కి రూ 3-0-0 వి, పి. చార్జి అదనము.

పైలోసాల్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ

131, న్యూభోయిగూడ,శికిందరాబాద్.

ప్రతిజిల్లాయందును ఏజంట్లుకావలెను.

# గాంధిగారి నాయకత్వము నకుఆంధ్రసామ్యవాదుల ప్రతికూలత

ఆంధ్రరాష్ట్రీయ మహాసభలోఆంధ్రసామ్యవాదులఉద్ధృతము

జూను ౨౦ వ తేదీఆదివారము నాడు ఉదయమున శ్రీయుత గొట్టిపాటి బ్రహ్మయ్యచౌదరి గారి అధ్యక్షతక్రిందనంద్యాలలో మహానందీశ్వర స్వామిదేవాలయమునందు పదునారవఆంధ్రరాష్ట్రీయ సభ ప్రారంభమైనది. సన్మాన సంఘాధ్యక్షుడు శంకరరెడ్డిగారు ప్రతినిధులకు స్వాగతమొసగిరి, వి.రాజగోపాలాచారిగారు సభను ప్రారంభించిరి.పిమ్మట అధ్యక్షోపన్యాసముజరిగెను.

సోదర సోదరీమణులు చాలమంది ప్రతినిధులుగను, ప్రేక్షకులుగను సభకువచ్చిరి.

౨౧వ తేదీఆదివారము నాడు ఉదయమును, మధ్యాహ్నమును, రాత్రిచాల సేపటివరకును గూడ సభజరిగినది.

తీర్మానములు

గాంధీ మహాత్ముని నాయకత్వమునందు సంపూర్ణవిశ్వాసము కలదనుతీర్మానము అత్యధికసంఖ్యాకులచే నామోదింపబడెను.

గాంధీమహాత్మునియందు సంపూర్ణ విశ్వాసము కలదనువాక్యమునుతీసి వేయవలయును గవర్నరులవాగ్దానము నిచ్చిననేగాని కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింపగూడదు-అనిసామ్యవాదులుప్రతిపాదించిన సవరణపై చాల చర్చ జరిగినది. ఈసవరణకు అనుకూలముగా ౪౦ మందియును,ప్రతికూలముగా ౯౦మందియును వోటు చేసిరి; సవరణవోడిపోయినది.

తాత్కాలిక మంత్రుల యేర్పాటు రాజ్యాంగ న్యాయ విరుద్ధమనియు, మదరాసుఅసెంబ్లీకిఎన్నుకొనబడిన ౧౫౯ మంది అవిశ్వాసముప్రకటించినను మదరాసుతాత్కాలిక మంత్రివర్గమురాజీనామ నీయకుండుట అనుచితమనియు గవర్నర్లు శాసన సభను వెంటనేసమావేశపర్చవలెననియు,సర్ కూర్మాగారు కాంగ్రెసునుగూర్చి అమర్యాదగ మాట్లాడుట తగదనియుతీర్మానింపబడెను

ప్రభుత్వాజ్ఞలచే కొత్తపట్టణం వేసంగిపాఠశాల విషయములోజరిగినదంతయు నిరసించబడెను. కడప కర్నూలు, బళ్లారి, అనంతపూరు, చిత్తూరు జిల్లాలనుగూడ ఆంధ్ర విశ్వవిద్యాలయమున చేర్చవలయుననియు, ఆంధ్రదేశమునందంతను ఒకప్రత్యేక రాష్ట్రముగా చేయవలెననియు, నెలకు ౨౦౦౦ రూపాయలకంటె హెచ్చుజీతములను పుచ్చుకొన్న ప్రభుత్వోద్యోగుల జీతములలో ౧౦౦ కి ౨౫ వంతువతగ్గించవలెననియు తీర్మానించబడెను,

మొసలికంటి తిరుమలరావుగారినివల్లభాయిపటేలుగారు భారత శాసనసంఘసభకుకాంగ్రెసు అభ్యర్థిగానంగీకరించుటనుగూర్చి అతితీవ్రమైనచర్చజరిగినది. సభ్యులలో రెండుకక్షలేర్పడునట్లు గూడకనబడినది గాని సూర్యనారాయణమూర్తిగారు అభ్యర్థిత్వమును వదలుకొనుటవలన సమాధానమేర్పడినది. వల్లభాయిపటేలుగారి నిర్ణయమే ఆమోదింపబడెను.

౨౨-౬-౩౭ మంగళవారం ఉదయమున౧౧ గంటలకురెండవ నాటి ఆంధ్రరాష్ట్రీయసభ ముగిసినది చాల తీర్మానములామోదింపబడెను.సామ్యవాదులు యువజనులున్నను వారు సభానియమములను (పార్లమెంటరీ ప్రాక్టీసు)సరిగా పాటించకపోయినను చివరకంతయును సామరస్యముతోనే జరిగినది. —ఆంధ్ర


డోంగ్రే గారి బాలామృతము బలహీనమైన బిడ్డలకు పుష్టియును, బలమున్ను, ఆరోగ్యము నిచ్చును.

కలరా కలరా
భయములేదు భీతిజెందకుడు
కలరాకు దివ్యౌషధము
విక్టర్ డ్రాప్స్ మిమ్ము కాపాడగలవు.
గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్ డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.
సోల్ యెజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు.

భగవాన్‌లాల్ నారాయన్‌జీ
అత్తరు వ్యాపారులు
మచ్లీకమాన్, హైద్రాబాదు
మావద్ద అన్నివిధములైన స్వదేశీ అత్తరు తైలములు, అగరుబత్తీలు, కుంకుమపువ్వు, చాయపత్తీలు జర్దా మొదలగునవి అమ్మబడును

ప్రసిద్ధ లోకామయహర
కస్తూరి మాత్రలు
జలుబు, జ్వరము, దగ్గువగైరాలకు చాల ఉపయోగము.
సీసాంకి రు ౦-౮-౦.
శ్రీసీతారాఘవ ఔషధాలయం
మైసూరు
ఏజంట్లు:-చగన్‌లాలు నారాయణజీ అత్తరు వ్యాపారులు
హైద్రాబాదు దక్కన్

SITHARAGHAVA AUSHADHASALA

పతంగెబ్రదర్స్
SPORTS SHIRTS
READY TO WEAR OR MADE TO MEASURE
ORDINARY TENNIS COLLAR
BAND NECK
GLADNECK
KOOL-NEK
PATANGAY BROS.
READY MADE CLOTH MERCHANT
అన్నిరకములలో సిద్ధమైనదుస్తులు వలయునేని
ప్రధాన కార్యాలయము:—
పతంగెబ్రదర్స్, సాలార్‌జంగ్ బిల్డింగ్
బ్రాంచి హైద్రాబాదు.
గవర్నమెంటు బిల్డింగు నం. ౨౧ పురాన జైలుబజారు
సికింద్రాబాదు.

హిజ్‌మాస్టర్సు వాయిస్ గ్రామఫోనులలో
తగ్గింపు ధరలు
His Master's Voice

| వాయి | మాడల్ నంబరు | మొదటివెల | తగ్గింపువెల |
| --- | --- | --- | --- |
| పోర్టబుల్ | ౧౨ | రు ౧౦౦ లు | రు ౭౦ లు |
| రంగులలో చర్మముకప్పుగలది | ,, | ,, ౧౧౦ ,, | ,, ౯౦ ,, |
| మంచిఫేషనులో | ,, | ,, ౧౧౦ ,, | ,, ౧౦౦ ,, |

అన్ని రకముల తెలుగుగ్రామఫోను రికార్డులు మావద్దదొరకును.
స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.
బి. జి. చిమలి
జాంబాగు, హైద్రాబాదు దక్కన్.

ఆర్. గోపాల్
జనరల్ క్యాప్ మర్చంటు
పులెౌ సూటర్స్, పులెౌ అండ్‌కాటన్‌సాక్స్, బ్లాజెస్ మొదలైన అన్నిరకములు కాటన్ అండ్ సిల్కులో, ఫ్రాక్స్ అన్నిరకములు, సిల్కుఅండ్‌కాటన్ దస్తీలు, ఫర్‌ఫోల్డింగ్, చెస్టర్‌ఫోల్డింగ్, సాలార్‌జంగ్ షేప్, కాశ్మీర్‌పులెౌ మొదలైన అన్నిరకముల టోపీలు సిద్ధముగా దొరకును.
ముఖ్యముగా గమనింపుము:—ఆర్డర్లపై కోరినప్రకారం టోపీలనుయిరువదినాలుగుగంటలలో తయారుచేసి యివ్వగలము.
ఆర్. గోపాల్
జనరల్ క్యాప్ మర్చంటు
బస్‌స్టాండ్ కోటీ, సుల్తానుబజార్, హైద్రాబాద్ (దక్షిణ

The best medium for reaching 7 million Andhras, of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు

నిజాం రాష్ట్రము ఎనిమిది జిల్లాలలోని పట్టణములలో మీ వస్తువిక్రయ సాధనము గోలకొండ పత్రికలో ప్రకటనము

Vol. 12. | Thursdy 1—7—1937 | No. 16

## విద్యా ద్రవ్యాదులు లేకుండా అంటరానితనము అడుగంటునా?

(బాబు—యస్. ఆర్. ఎ. కృపానందసాధూగారు)

భారతదేశమున నీ అంటరానితనము చిరకాలమునుండి పాదుకొనియున్నది. దూరముగాయోచించిచూచిన లోక వ్యవహారార్థమై గుణకర్మలబట్టి చాతుర్వర్ణ్యంబులుగా విభాగింపబడినట్లు గాన్పించుచుండునుగాని అయిదవజాతియే శ్రుతులలోను గాన్పించదు. గుణకర్మలబట్టి జాతులేర్పడినట్లు, వసిష్ట, గౌతమ, జంబుక, నారద, మాండవ్యాది మహాత్ములేగాక ప్రస్తుతము అంటరానివారని పిలువబడెడు వారిలో గూడ వాల్మీకి మతంగ, తిరుప్పాణియాళ్వారు, భక్తనందనార్, గోకామేళ్, మారుమారినంబి మొదలగు మహాశయులే తార్కాణము. వీరలు విద్యావినయ విధేయతా భక్తిప్రపత్తులచే మహర్షులు గాను, బ్రాహ్మణులుగాను, మహాభక్తులు గాను పరిగణింపబడిరిగాని జాతిచేకాదు. బహుశా యీ అంటరానితనము ఆర్యానార్య పోరాటములలో ఆర్యులకు వ్యతిరేకమైనవారలకీ పదము నంటగట్టియుండవచ్చునని మానుడి సెల్వయకొందనజాలరు—

అసలు ఈ జాతివ్యవస్థలు జంబూ ద్వీపమున గల భరతఖండమునసే గాక పుష్కరద్వీపము తప్ప మిగత ద్వీపములలోకూడ గలిగియున్నట్లు తెలియుచున్నది. శాల్మలీద్వీపమున కపిలులు, అరుణులు, పీతులు, కృష్ణులు అనియు, ప్లక్షద్వీపమున ఆర్యకులు, కురవలు, విదంశ్యులు, భావినులు అనియు, కుశద్వీపమున కర్మిణులు, సుష్మిణులు, స్నేహులు, మందేహులు అనియు, క్రౌంచద్వీపమున పుష్కలులు, పుష్కలులు, ధన్యులు అఖ్యులు అనియు, శాకద్వీపమున మంగులు, మాగధులు, మానసులు, మగములు అనియు నాలుగుశాఖలుగా వ్యవహరింపబడుచున్నట్లు తెలియుచున్నదిగాని అచ్చట వ్యవహార నామమాత్రమేగాని జాతివ్యవస్థలు భారతదేశమంత కట్టుదిట్టములు లేనట్లు తెలియుచున్నది. జంబూద్వీపమునగల నవవర్షములలో భారతవర్షము తప్ప మిగతకింపురుష, ఇలావృత, హరి, నిష్కక, హిరణ్మయ, భద్రాశ్వ, కేతుమాల, వర్షములు అనగా ఇటలీ, జర్మనీ, బ్రిటీషు, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు మొదలగు ప్రదేశములలో వ్యవహారములబట్టి ఆయా శాఖలుగా పరిగణింపబడినను అంటరానితన మచ్చట లేకపోవుటయేగాక జాతివ్యత్యాసల నిర్బంధము కానరాదు.

*　　*　　*　　*

ఈదేశమున మానవులెన్ని శాఖలు యెన్ని మార్గములుగా పరిగణింపబడుచున్నను అందరకు గమ్యస్థానమొక్కటే యగుటచే హిందువులనియు, హైందవులనియు, హిందూమతమనియు, హిందూదేశమనియు పిలువబడుటయేగాక ఇదిమహాపవిత్రమైన ప్రదేశమని వాకొనబడుచున్నది. ఇట్టిపవిత్రమైన ప్రదేశములో కొన్ని జీవులు నీచముగా చూడబడి అంటరానివారుగా పరిగణింపబడవలసి వచ్చెననగా ఇందుకు కారణము అగ్రజాతులేగాక నీ అంటరానివారని వ్యవహరింపబడెడువారుకూడ కొంత కారకులనిన మావాక్యమెంతమాత్రము సత్యేతరము కాజాలదు. యేమంటే మహోన్నత్యాభివృద్ధులు గాంచవలెనన్నను ముఖ్యముగా విద్యాద్రవ్యాదులు ఆత్యావసరము. ఆవిరెండులేనిది యేసంఘము అభివృద్ధి గాంచజాలదు. ఇవిరెండు నీసంఘములో లోపించియుండుటయేగాక వీరిలోనికి ఐకమత్యములేకపోవుటయు, అనాచారములు మెండుగాగలవనిన సత్యేతరముకాదు. మరియు జాతిభేదములనునది అగ్రజాతుల సంకేతటుండగా వీరిలోకూడ ౧. మాలలనియు, ౨. మాలమాతంగులు, ౩. దేవరలు, ౪. సచ్చనులు, ౫. మాల(నిత్య) వైష్ణవులు, ౬. మాలభోగమువాళ్లనియు మొదలగుననేక శాఖలుగలవు. వీరిలోవీరికి సంబంధబాంధవ్యములు లేవు. ఒకరియింటఒకరు భోజనం చేయరు. ఇదియుగాక మాదిగ [అరుంధతేయ]లు అనుమరియొక తెగగలదు. మాలలనువారిలో నెన్నిశాఖలు గలవో మాదిగయనువారిలోకూడ నన్నిశాఖలు గలవుగాని అగ్రజాతులకు వీరలిద్దరు సమానమేయైనను వీరిలోవీరికి బద్ధవైరము. ఒకరిపాదొకరికిగిట్టదు. ఒకరినొకరు ముట్టరు. ఒకరివింటనొకరుభోజనంచేయరు. తుదకు దైవసంబంధమైన కార్యములకుపైతము వీరుచేయు కార్యమునకు వీరిని చేరనివ్వరు స్పర్శకూడ తగులనీయరు. ఈ స్థితిలోవీరు పైకివెల్లరాగలరా? మందమయింటగెల్పినగదా రచ్చగెలవుట! యింటనేగెలువలేనప్పుడు రచ్చకెక్కిన ప్రయోజనమేమి? ఈ అంటరానితనము రూపుమాప శ్రీ భగవద్రామానుజులవారికాలములో వీరికికొన్ని హక్కులు కలుగజేసిరికాని వారికికూడ సనాతనపిశాచము యెదుర్కొనుటచేతనో లేక మరేకారణముననో వారుకూడ నీ అంటరానితనమును పూర్తిగా బాపజాలకపోయిరి. యిచ్చినహక్కులు సవ్యముగా నడుపజాలక పోయినందులకు వీరుకూడ ముఖ్యకారకులని [illegible] కాదనజాలరు.

వర్తమానకాలముననో యేమూలజూచినను యేపత్రికలో జూచినను హరిజనోద్యమమనియు, అస్పృశ్యతానివారణ సంఘములనియు, ఆదిమాంధ్రోద్యమములనియు అరుంధతేయ సభలనియు మొదలగునేక ఉద్యమములుబాహ్యముగ చూపుచున్నవి. వీటికి వ్యతిరేకమైన సనాతనోద్యమములుకూడ వీటికి వెనువెంటనే లేకపోలేదు. కుమారుడు హరిజనోద్యమములో నుంటె తండ్రి సనాతనోద్యమమునకు పరుగులెత్తుచుండును. సోదరుడు అస్పృశ్యతానివారణ చేయుచుంటె అన్నగారు ఆర్యధర్మము విలపమంటాడు కోడలు అంటుదోషము తీసివేయాలంటే అత్తగారు ముట్టుకూడదంటుంది. భర్త హరిజనపల్లెకువెళ్ళితే భార్య స్నానము చేయనిదే లోపలికి అడుగుపెట్టనియ్యదు. ఇకముమ్మల చేర్చుకొనవలెనదోయని అంత్యజాతులు చేర్చుకోవలెనని అగ్రజాతినాయకులు బెంచీలుగుద్ది ఈ పవ్యాసములపై ఉపన్యాసములు, రిజల్యూషనులపై రిజల్యూషనులు ప్యాసుచేయడమేగాని చేర్చుకొనువారెవ్వరో, చేరువారెవ్వరో, చేరవలసిన గమ్యస్థానమెద్దియో బోధపడకున్నది. వీరు చేరవలసిన గమ్యస్థానములకు ముఖ్యముగా విద్యాద్రవ్యములు, ఐకమత్యము అత్యావశ్యము. యిప్పటిలో కొరతగలిగియున్నవనిన మావాక్యము సత్యేతరముకాజాలదు. మరియు వీరిలో పనాయకులలో కొందరనాలోచనపరులు అంబేద్కర్ పలికినట్లు మనమేల పలుకగూడదని ఆయాసభలలో హిందువులను నమ్మగూడదనియు, హిందూమతము తప్పుడుమతమనియు రాముడు దేవుడుకాడనియు రావణాబ్రహ్మ తమవాడనియు తోడిసాంఘికులను హిందూ పండుగలలో పాల్గొనగూడదనియు పలుకుచున్నట్లు తెలియుచున్నది. ఇందుకువీరలు తాము నిలచియున్న హిందువులనే నమ్మకపోయిన యేస్థితిలోనుందురో వేరు చెప్పనక్కరలేదు. రావణుడు శివపూజాదురంధరుడనుసంగతి లోకవిదితమైయుండ అతినిచుట్టాలను చెప్పుకొనెడి వీరుహిందువుల నమ్మకూడదు. హిందూమతము తప్పుడుమతమనుటకంటె యనాలోచనవేరొకటుండదు. వీరలికనైన తమయవివేకమువీడి యథార్థముగ్రహించి ప్రవర్తించుట యుక్తము. అంబేద్కర్, ఆందోళనచేయుటకు కొంతకారణమున్నది. అనగా ఈ అంటుదోషమునది ఉత్తరదక్షిణ ప్రాంతములలో మిక్కుటముగాగలదు అచ్చటవీరు వీధులవెంటరాకూడదు. బండ్లెక్కకూడదు. కొన్ని గ్రామాదులలో పంచముడు గ్రామవీధులకు పెద్దియేని పనివుండి రావలసివచ్చిన "నేను మాలవాడినండో"యనికేకలువేయుచు రావలెను అతడట్లు కేకలువేయుచువచ్చుచున్న అడుగులపైనన్న బ్రాహ్మణులు లేచి లోపలికిపోదురు. మరికొన్ని గ్రామాదులలో బ్రాహ్మణులు యింటనుండి బయలుదేరిన "హూ, హూ"యని అరచుచుబయలుదేరుదురు. ఆశబ్దమువిన్నతోడనే పంచములు గ్రామవీధులలోనికివచ్చుచున్న వెనుకకుమరలి పారిపోవలెను. ఆకారణముచేతనే పూర్వమొకకవి ఏమివర్ణించినాడనగా, [శ్లో॥ కేరళే వానరాకారం। హూహూశబ్దం నిరంతరం॥] అని ప్రయోగించెను. అనగా అచ్చట యేగ్రామములోనైనను సర్వకాలములయందు వానరులవలె, హూహూయను శబ్దమే వినబడుటవల్ల నాకవియిట్లు ప్రయోగించెను. ఇంకను ఆయాప్రాంతములలో కొన్ని యోనిబంధనలు నేటికిగూడగలవని తెలియుచున్నది. అట్టిస్థితిలో ఆయాప్రాంతములలో ఆందోళనచేయుట కొంతసమంజసమే కాని ఆంధ్రదేశమున కదియవసరముకానరాదు. ఇచ్చట వ్యాపారముచేసుకొనిన అడుగువారులేరు. వ్యవసాయము చేసుకోవచ్చును బండ్లు తోలుకొనవచ్చును. బండ్లెక్కవచ్చును. ధనమున్న మోటారులెక్కి స్వేచ్ఛగా తిరుగవచ్చును. నాటకాలు చూడవచ్చును, కాఫీహోటళ్లకు వెళ్లవచ్చును. వీధులలో స్వేచ్ఛగా తిరుగవచ్చును. ఉత్సవములుచేసుకొనిన అడుగువారులేరు. అట్టిస్థితిలో ఆయాందోళన యిచ్చట ప్రవేశపెట్టినందువల్ల మరికొంత హైన్యమునకు గురికావలసివచ్చునేగాని ఔన్నత్యము బడయజాలరని నానమ్మకము. అయినను గాంధీమహాత్ముడు వీరల యశస్సునుకోరి అహర్నిశంబులు ప్రయత్నించుచుండెను. వీరలనందరను శ్రేష్ఠమైన నామముతో పిలిపింపదలచి అందరికనుకూలమగునట్లు శ్రేష్ఠమైన "హరిజన" అను నామమిడి వీరలఅభివృద్ధికై ప్రచారముచేయుచుండెను. వారిప్రబోధమననుసరించుచు వీరు ప్రవర్తించిన శీఘ్రకాలములో వీరభివృద్ధిని గాంచగలుగుదురేగాని మాటలుకోటలు దాటించిన మాత్రమున ప్రయోజనములేదు.

శ్లో॥ అంత్యజాత ద్విజాతిశ్చ
　ఏకయేవ సహోదరః
　ఏకయోని ప్రసూతశ్చ
　ఏకశాఖే నజాయతే.

అను నార్యోక్తిరీతిగా ఆదిలోనందరు నొకశాఖవారైనను వారివారి గుణకర్మలబట్టియు శుచిర్భూతాదులబట్టియు పూజ్యనీయులై అగ్రజాతులని వ్యవహరింపబడుచున్నారు. గాని క్రియారహితమైన వృథావాగాడంబరములతో వారలకా జాత్యైక్యతలు చేకూరలేవు. అలాగుననే వీరలుకూడ అంటరానితనము అడుగంటజేసి కులౌన్నత్యము బడయవలెనన్న ముమ్మందు వీరలలోగల అనాచారము అనుపిశాచమును రూపుమాపి శుచిర్భూతము గావించవలెను. అదిలేనిది యేమతమువారు నంగీకరింపజాలరు. కర్మహీనులైన పాశ్చాత్యజాతులుకూడ శుచిర్భూతానుజాకే యెక్కువవిలువ నొసగెదరుగాని అనాచారాదులకు విలువనివ్వరు. శుచివిద్యవినయవిధేయతాదులవల్లనే పైనగొప్పబడ్డ మహాసీయులెల్లరు అగ్రస్థానమలంకరించి నేటిదనుక పూజ్యనీయులైరి. నిజముగా వీరినిత్వరలో పైకితేవనెత్తవలెనన్న ముఖ్యముగా విద్యాద్రవ్యములుండవలెను. వీరిని ఔన్నత్యమునకుగొనిరావలెనన్న ఈ రెండువిషయములలో వారికి తోడ్పడవలయునేగాని లేనిపోని ప్రబోధములుగావించి అగ్రజాతులవారికి వీరికి కయ్యములుపెంచినందువల్ల అభివృద్ధికిమారుగా మరికొంత అనాచారమునకు హైన్యమునకు గురికావలసివచ్చును. ఈ అంత్యజాతుల లేవదీయుటకు విద్యాద్రవ్యదులే ముఖ్యావశ్యకములు అవికలిగినవాడే వారుపైకి రాగలరుగాని క్రియారహితమైన మరియొకమార్గమున యున్నటికి ప్రయోజనముగాంచజాలరు.

[రెడ్డిరాణి]

## మా చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో చందా నంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు. తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను.

నో:— చందానంబరు తమకుపంపుపత్రిక పైన వుండును.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K. Balakrishna Reddy